## శ్రీ కిద్వాయి మృతికి పలుచోట్ల సంతాప సభలు

### రాజమంద్రి

రాజమండ్రి, అక్టో 27: రాజమండ్రి పురపాలక సంఘంవారు చైర్మన్ శ్రీ ఎ. బి. నాగేశ్వరరావుగారి అధ్యక్షతన నేడు జరగవలసిన అత్యవసర సమావేశాన్ని శ్రీ కిద్వాయ్ మృతికి సంతాప తీర్మానం ఆమోదించి వాయిదా వేశారు.

నిన్న సాయంత్రం పట్టణ యువజన కాంగ్రెసు, పట్టణ కాంగ్రెసువారు శ్రీ యస్. చాటురాజుగారికి అధ్యక్షతన పౌరసభ ఏర్పాటు చేశారు. రఫీ అహ్మద్ కిద్వాయ్ మృతివలన భారతదేశం ప్రజాసమస్యలను అర్థంచేసుకొని సక్రమ కార్యాచరణలో పరిష్కరించగల మంత్రివర్యుణ్ణి కోల్పోయిందని సంతాప తీర్మానం చేశారు. సభలో శ్రీయుతులు ఎం. సోమసుందరం, ఎస్. నాగనయ్య, పి. సూర్యప్రకాశరావు, బి. వెంకటరావు, డి. వీరాస్వామిరెడ్డి, ఘం. చంద్రశేఖరం, పి. అప్పారావు గారలు ఆయన కృషిని ప్రశంసిస్తూ ప్రసంగించారు.

### రాజోలు

రాజోలు, అక్టో 25: రాజోలు కాంగ్రెసుసంఘ కార్యవర్గంవారు శ్రీ ఘం. విశ్వనాథంగారి అధ్యక్షతన సమావేశమై శ్రీ కిద్వాయ్ మృతికి చింతిస్తూ సానుభూతి తీర్మానం చేశారు. తరువాత కార్యక్రమం నిలిపివేసి, సమావేశం వాయిదా వేశారు.

### పామర్రు

పామర్రు, అక్టో 26: కాంగ్రెసు కార్యకర్తలు ఇక్కడ ఏర్పాటుచేసిన సంతాపసభలో శ్రీయుతులు ఎ. వెంకట్రామిరెడ్డి, జి. వీరరాఘవయ్య, టి. వీరాంజనేయులు, మహమ్మద్ అబ్దుల్ మజీద్ మొదలగువారు మాట్లాడారు. విద్యార్థి కాంగ్రెసు కార్యకర్తలు శ్రీయుతులు జి. వీరరాఘవయ్య, వి. కేశవరెడ్డి, పి. సూర్యప్రకాశరావు, బి. పిచ్చిరెడ్డిగారలుకూడా సమావేశం ఏర్పాటుచేసి కిద్వాయ్ మృతికి సంతాప తీర్మానం చేశారు.

### గుంటూరు

గుంటూరు, అక్టోబరు 25: ఆంధ్రా బంసత్ వారు స్వర్గీయ రఫీ అహమ్మద్ కిద్వాయ్‌కి శ్రద్ధాంజలి అర్పించారు. ఈ సభలో ఆంధ్రా అడ్వకేట్ జనరల్ శ్రీ దువ్వూరి నరసరాజుగారు మాట్లాడారు. "శ్రీ కిద్వాయ్ సమంజసమైన సలహా నిర్భయంగా పండిట్ నెహ్రూకి చెప్పేవారు. ఆయన మృతి భారతదేశానికి ఆంధ్రదేశానికి ఎంతో నష్టం. నూతనాంధ్ర రాష్ట్రం గవర్నరు పరిపాలనలో ప్రారంభం కాకూడదు. ఆ రాష్ట్ర నాయకత్వం వహించి ప్రభుత్వాన్ని నడపటానికి వృద్ధులు, అనుభవజ్ఞులు అయిన శ్రీ ప్రకాశం గారిని ప్రయత్నించ కోరవలసిందని పదేపదే నెహ్రూ గారికి చెప్పి అంగీకరింపజేశారు. కిద్వాయ్ మృతితో కేంద్ర ప్రభుత్వంలో ఆంధ్ర రాష్ట్రం ఒక ఆప్తుడయిన, ముఖ్యస్నేహితుని కోల్పోయింద"ని శ్రీ నరసరాజుగారు అన్నారు. కార్యదర్శి శ్రీ దాసరి రామమూర్తిగారు సానుభూతి తీర్మానం కిద్వాయ్ గారి కుటుంబానికి పంపించారు.

### మదనపల్లి

మదనపల్లి, అక్టోబరు 26: పంచాయతీ బోర్డు ఆవరణలో శ్రీ టి. యన్. విశ్వనాథరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన బహిరంగసభలో శ్రీ కిద్వాయ్ మృతికి సంతాప తీర్మానం చేయబడింది. శ్రీయుతులు టి. గోపాలకృష్ణ గుప్త, యం. వి. పాపన్న గుప్త, యస్. రంగాకృష్ణ గారలు ప్రసంగిస్తూ శ్రీ కిద్వాయికి నివాళు లర్పించారు. అన్ని కార్యాలయాలమీద పతాకాలు అవనతం చేయబడినాయి. (పి. టి. ఐ.)

### నంబూరు

నంబూరు, అక్టోబరు 25: గ్రామ విద్యార్థి ఫెడరేషన్‌వారు నేడు శ్రీ ఎ. సాంబిరెడ్డిగారి అధ్యక్షత క్రింద సమావేశమై శ్రీ కిద్వాయి మృతికి సంతాపం ప్రకటించారు.

### తాడేపల్లిగూడెం

తాడేపల్లిగూడెం, అక్టోబరు 25: [illegible]

### పుత్తూరు

పుత్తూరు, అక్టోబరు 26: [illegible]

### బాపూజీ హరిజన సేవా సంఘం సానుభూతి

[illegible]

## ఉత్సాహోద్రేకాలు సద్వినియోగమవాలి

### గోవిందరాజులు నాయుడు గారి హితవు

మద్రాసు, అక్టోబరు 28: ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినందువల్ల కలిగిన ఉత్సాహాన్ని నిర్మాణాత్మక కార్యాలకు వినియోగించవలెనని ప్రాంతీయ, కుల తత్వాలకు స్వస్తిచెప్పవలెననీ, ఐకమత్యాన్ని సాధించుకొని రాష్ట్రాభివృద్ధికి కృషి చేయవలెననీ తిరుపతి వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ రంగం గోవిందరాజులు నాయుడుగారు నిన్న సాయంత్రం ఇక్కడ కళాశాల ఆంధ్రవాఙ్మయ సమితివారు విక్టోరియాహాలులో జరిగిన ఆంధ్రరాష్ట్ర అవతరణ ఉత్సవానికి అధ్యక్షత వహిస్తూ చెప్పారు.

ఆర్. బాలసరస్వతి గారి ప్రార్థనతో సభారంభమైనది. కళాశాల ప్రధానాంధ్రోపన్యాసకులు శ్రీ చల్లా సత్యనారాయణగారు సదస్యులకు స్వాగతమిచ్చారు.

రాజ్యసభ సభ్యులు కోటూరిసత్యనారాయణగారు మాట్లాడుతూ ఆంధ్రరాష్ట్రం ఏర్పడినందువల్ల అవస్థాలు ఏర్పడగలవనే అపోహలు నిరాధారాలని ఆంధ్రరాష్ట్రం ఋజువు చేయగలిగిందనీ, ఆంధ్రులకు రాజ్యసంబంధమైన పలుకుబడి పెరిగి, ఆంధ్రదేశసంపద సద్వినియోగానికి రావాలంటే రెండురాష్ట్రాలు ఏర్పడవలెననీ, ఆంధ్రులు ఇరుగు పొరుగు రాష్ట్రాలతో సఖ్యతతో స్నేహముతో ఉండవలెననీ చెప్పారు. ఆంధ్రులు నదీసంపదను, ఖనిజసంపదను వృద్ధిచేసుకున్ననాడు ఆంధ్రరాష్ట్రం అగ్రగామిఅయిన రాష్ట్రాల్లో ఒకటిగాపరిగణింపబడగలదన్నారు.

అధ్యక్షులు గోవిందరాజులు గారు తమ ఉపన్యాసంలో ఇల్లా తెలియచేశారు:

"ఆంధ్రరాష్ట్రం ఏర్పడి బాగా నడుస్తోంది. విప్లవాలేమీ రాలేదు. శాంతికి భంగం కలుగలేదు. ప్రజల్లో రాష్ట్రంతోపాటుమంచి ఉద్రేకం కలిగినది. ఆ ఉద్రేకాన్ని క్రియారూపంలోకి సక్రమంగా మనం ఇంకా వినియోగించుకోలేదు. కర్నూలు అనేది ప్రస్తుతానికిమటుకురాజధాని అయింది. మరో మంచిపట్నం వస్తే అది రాజధాని అవుతుందనుకోండి. హైకోర్టు ఏర్పడినది. పెద్ద ఉద్యోగాలన్నీ ఆంధ్రులకు వచ్చాయి. ఒక విశ్వకళాపరిషత్తు వచ్చినది. ఇల్లాంటి మేళ్లు కొన్ని జరిగాయి.

"ఇక వచ్చే ఆదాయం ఖర్చుకు చాలటంలేదు. కొత్త పనులు చేయడానికి డబ్బులేదు. ఆదాయం పెంచుకొనే మార్గాలు చూచుకోవాలి. ఉద్రేకం-ఆవేశం మంచివే. స్థిరంగా క్రియారూపంలో ఉపయోగించుకోవాలి. ఆంధ్రరాష్ట్రం రావడానికి ముందు అప్పటికి ఇప్పటికి తేడాలేదు అనుకుంటాను. ఆంధ్రరాష్ట్రం వచ్చిందని ఆనందించాం. సంతోషించాం. చేసిందేమిటి? మన నడవడిక, కృషి, దేశసేవ, ఐకమత్యం - ఈవిషయాల్లో తేడా ఉన్నదా? ఆలోచించుకోవాలి. దేశమున్నదీ అంతా ఒకటే. ఈ ప్రాంతం, ఆ ప్రాంతం, ఈ శాఖ, ఆ శాఖ ఈ కులం ఆ కులం అనేవి పైకి వస్తున్నట్లు ఇప్పుడు కనిపిస్తోంది. కలహాలు జరగకపోవచ్చు. ఇట్టి తారతమ్య భావాలు, ఉద్రేకాలు తగ్గించుకోవాలి. లేకపోవడం క్షేమానికి కారణంగాదు."

సంఘకార్యదర్శి జె. వి. రమణగారు అభివందనాలు తెలిపారు. శ్రీ మాధవపెద్దిసత్యం, కె. రాణిగారలు పాటలు పాడాక సభ ముగిసినది.

## దక్షిణ ఆఫ్రికా భారతీయ సమస్య

### ఎనిమిదిరాజ్యాల తీర్మానానికి ఇండియా సమ్మతి

యునైటెడ్ నేషన్స్, అక్టోబరు 28: దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులనుగురించి ఎనిమిది దక్షిణ అమెరికారాజ్యాలవారు కలిసి [illegible]

[illegible]

## పింఛనదీ రిజర్వాయర్ నిర్మాణానికి శంకుస్థాపన

### ప్రభుత్వ కృషిని వివేకంతో పరిశీలించాలని శ్రీ సంజీవరెడ్డిగారి విజ్ఞప్తి

(స్వంత విలేఖరి)

కడప, అక్టోబరు 28: "ఒక యేడాదిలో ఆంధ్రప్రభుత్వం అనేక ఇరిగేషన్ ప్రణాళికలనూ, అభివృద్ధి కార్యక్రమాలనూ ప్రారంభించి అమలు జరిపింది. యీ పింఛానదీ రిజర్వాయర్ స్కీము వాటిలో ఒకటి, గత రెండు శతాబ్దాలలో నిర్మించబడిన ప్రాజెక్టులతో ఆంధ్రప్రభుత్వం ప్రారంభించిన అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలు పోల్చిచూస్తే ప్రభుత్వం సాధించిన విజయాలు స్పష్టం కాగలవు." అని ఈ వేళ చుంచుపల్లి గ్రామంలో జరిగిన సభలో ఉపముఖ్య మంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అన్నారు. పింఛనదీ రిజర్వాయర్‌కు సంజీవరెడ్డిగారు ఈ వేళ శంకుస్థాపనోత్సవం జరిపారు. ఆ సందర్భంలో యీ సభ జరిగింది.

ఈ రిజర్వాయరు వద్దనుంచి పల్లె కాలవను స్వయంగా కృషి చేసి నిర్మించవలసిందిగా ఆ ప్రాంతంలోని ప్రజలకు స్థానిక పరిపాలనాశాఖ మంత్రి పి. తిమ్మారెడ్డిగారు విజ్ఞప్తిచేశారు.

రిజర్వాయరు నిర్మాణస్థలం వద్దకు రాగానే మంత్రులకు ఇరిగేషన్ శాఖ చీఫ్ ఇంజనీరు శ్రీ వెంకటకృష్ణయ్యర్ స్వాగతమిచ్చారు.

అనంతపురం సర్కిల్ సూపరింటెండింగ్ ఇంజనీరు శేషాచలారం గారు ఈ స్కీము చరిత్రను ఈ క్రింది విధంగా వివరించారు.

"కరువుప్రాంతాలలో పరిస్థితులను అభివృద్ధిచేసే నిమిత్తం ఆంధ్రరాష్ట్రంలో ప్లానింగ్ కమిషన్ ఆమోదించిన 17 మధ్యరకం ఇరిగేషన్ స్కీములలో ఇదొకటి.

"చిత్తూరుజిల్లా పుంగనూరు తాలూకాలో పింఛనది పుడుతున్నది. ఇది బహుదానదికి ఉపనది. పింఛనది బహుదానదితో కలిసిన తరువాత దిగువ భాగంలో దీన్ని చెయ్యేరు అంటారు.

"70 వేల ఎకరాలకు నీళ్లుసప్లయి చేయించే ఉద్దేశంతో 1906 వ సంవత్సరంలో పుల్లంపేట ప్రాజెక్టు పరిశీలనలు యినవి. ఈ ప్రాజెక్టులో రెండు రిజర్వాయర్లుంటవి. వాటిలో ఒకటి రాయవరంవద్ద బహుదానదికీ రెండవదీ నీరపల్లి వద్ద మాండవ్యనదికి నిర్మించాలన్నారు. ఈ ప్రాజెక్టు నిర్మాణంవల్ల నెల్లూరు డెల్టా నష్టపడుతుంది. కనుక ఆ ఉద్దేశం విరమించుకొన్నారు. 1922 లో ఈ ప్రాజెక్టు మళ్లీ పరిశీలనకు రావడం మళ్లీ విరమించుకోవడం జరిగింది. రాయవరంవద్ద చెయ్యేరుకు 90 అడుగుల ఎత్తున ఆనకట్ట నిర్మించే సూచనతో యీ ప్రాజెక్టు నిర్మాణ సమస్య మళ్లీ 1941 లో పరిశీలనకు వచ్చింది. అయితే విలువయిన 4,400 ఎకరాల భూమి మునిగిపోతుంది కనుకనూ, వెనుకబడిన తరగతులకు చెందిన సన్నకారు రైతు లనేకమంది నిరాశ్రయులవుతారు కనుకనూ ఆ ఆలోచనకూడా విరమించుకోబడింది. పైన వివరించబడిన అభ్యంతరాల కారణంగా యీ స్కీమును విరమించుకోవలసిందిగా 1947 లో ఉత్తరువులు వచ్చినవి. అంటిట బహుదా, మాండవి, పింఛ, చెయ్యేరులకు నాలుగు రిజర్వాయర్లను నిర్మించే విషయంగురించి పరిశీలనలు జరపవలసిందిగా ఇరిగేషన్‌శాఖ చీఫ్ ఇంజనీర్ ఉత్తరువులిచ్చారు. చీఫ్ ఇంజనీరు సిఫార్సు ననుసరించి పింఛనదికొక రిజర్వాయరునూ, చెయ్యేరుకు మరొక రిజర్వాయరునూ నిర్మించే విషయం గురించి వివరంగా పరిశీలనలు జరపవలసిందిగా ప్రభుత్వం ఉత్తరువులు ఇచ్చింది. ఇప్పటి యీ స్కీము వాటిలో ఒకటి.

"ఈ పింఛనది రిజర్వాయర్ స్కీము కడపజిల్లా రాయచోటి తాలూకాలో వున్నది. ఈ రిజర్వాయరు నిర్మాణంవల్ల 2,730 ఎకరాలలో మొదటి పంటకూ, 60 ఎకరాలలో రెండవపంటకూ నీళ్లు సప్లయి కాగలవు. ఈ రిజర్వాయరు నిర్మాణంవల్ల 290 ఎకరాల మెట్టభూమి, 48 ఎకరాల మాగాణి మునిగిపోతుంది. ఈ రిజర్వాయరు నిర్మాణం వల్ల ఏడాదికి 1,860 టన్నుల వరి అదనంగా పండుతుంది. రాయలసీమలో కల్లా కరువుప్రాంతంలో వున్నది కనుకనూ, పాడుబడి బాయని బంజరుభూములు ఈ ప్రాంతంలో పుష్కలంగా ఉన్నవి కనుకనూ, ఈ ప్రాంతాలలోని ప్రజలకు సహాయపడే నిమిత్తం ఈ రిజర్వాయరు నిర్మాణాన్ని ప్రభుత్వం ప్రారంభించింది."

## పేదవారికి నివాస గృహాలు

### ప్రభుత్వ శ్రద్ధ

కడప, అక్టోబరు 28: పేదవారికోసం నివేశన స్థలాలు సేకరించి వాటిలో చిన్న చిన్న ఇండ్లు కట్టించి కొద్దిపాటి అద్దెకు వాటిని పేదవారికి ఇచ్చే సమస్య గురించి ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తున్నది. ఈ నెల 16 తేదీ ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువునుబట్టి ఈ విషయం స్పష్టమైంది.

[illegible] గా తయారు కావటమేకాక అనారోగ్యపరిస్థితులు ఏర్పడి ప్రజలకు అసౌకర్యంగా వున్నదని ఈస్కీము అమలు జరపవలసిన అవసరం గురించి ప్రభుత్వం వివరించింది.

రాష్ట్రంలోని వివిధ పురపాలక సంఘాలద్వారా ప్రభుత్వం ఈసమస్యను పరిష్కరించాలనుకుంటున్నది. ఇందుకు అవసరమైన స్థలాల సేకరణకు అవసరమైన ప్రతిపాదనలను పంపించవలసిందిగా పురపాలక సంఘాలను ప్రభుత్వం కోరింది. ఈస్థలాలను సేకరించిన తర్వాత మురికి గూడాలను తొలగించే ప్రణాళిక ననుసరించి వాటిలో చిన్న చిన్న ఇండ్లు కట్టించే వరకూ వాటిని పేదవారికి ముఖ్యంగా హరిజనులకు ప్రభుత్వం చౌకగా అద్దెకు ఇస్తుంది.

ప్రస్తుతం పురపాలక సంఘాలఆర్థిక పరిస్థితులు సంతృప్తికరంగా లేవు కనుక ఈస్కీము అమలులోకి వచ్చే అవకాశాలు అంతగా కనిపించడం లేదు. కాని, ఈస్కీము అమలు జరిగితే పట్టణాలు ఆకర్షణీయంగా తయారు కావడమేకాక పుండుగా పట్టణాలలో ఆరోగ్యాభివృద్ధి పరిస్థితులు పెంపొందగలవు.

ప్రస్తుతం కడపలో అనేకమంది పేదవారు రోడ్లమీదా, పార్కులమీదా, సత్రాలమీదా తాత్కాలిక నివాసాలుగా చేసుకున్నారు. వీరిలో ఎక్కువమంది కిందటి కరువులో ఇక్కడికి వలసవచ్చినవారు. వీరుకాక ఈ పట్టణంలోని పేదవారు పురపాలక సంఘానికి చెందిన పలుతావులలో పూరిండ్లు వేసుకున్నారు. ఇవన్నీ చాలా అనారోగ్యంగా వుంటవి. ఇటీవల కురిసిన వర్షాలకు ఈమురికి పేటలు నీళ్లలో మునిగినవి. కొన్ని ఇండ్లగోడలు పడిపోయినవి. స్వ. వి.

## అసెంబ్లీసమావేశానికి సన్నాహాలు

(1 వ పేజీ తరువాయి)

లోనూ ప్రభుత్వం 7 ఆర్డినెన్సులను జారీచేసింది. ప్రతిపక్షంవారు ఆర్డినెన్సులను వ్యతిరేకించడం మామూలుగా జరిగేదే. కాని ఈసారి ఈప్రతిపక్షంవారే ఆర్డినెన్సులలో ఒకటివ్యతిరేకించారు. అది ఇనాం రైతు రక్షణ ఆర్డినెన్సు. ఆర్డినెన్సు ప్రయోజనాన్ని ఎక్కువచేసేందుకు సవరణలు ప్రతిపాదించినా ప్రతిపాదించవచ్చు. అయితే మామూలుగా మాత్రం యిది ఆర్డినెన్సుల ప్రభుత్వం అని అంటారు. ఆర్డినెన్సులలో ఒకటైన శ్రీ వెంకటేశ్వరవిశ్వవిద్యాలయ చట్టసవరణకు ఉద్దేశించబడినది. ఆ ఆర్డినెన్సు చాలా ప్రమాదరహితమైనట్టిదిగూడా. మిగతా ఆర్డినెన్సులు ఆంధ్రబార్ కౌన్సిలుస్థాపనకు సంబంధించినట్టిది ఇందులోగూడా ఆర్డినెన్సు రాజ్ పాడ ఎక్కడాలేదు. ఎటొచ్చీ యిబ్బంది అల్లా ఒక జిల్లాబోర్డుల ఆర్డినెన్సు విషయంలోనే. ఈ ఆర్డినెన్సుద్వారా జిల్లాబోర్డు స్పెషల్ ఆఫీసర్ల పదవీకాలాన్ని మరో ఆరునెలలపాటు ప్రభుత్వం పొడిగించగలిగింది. మిగతా ఆర్డినెన్సులమీద ఆక్షేప చర్చ జరుగకపోవచ్చు. ఇది ఆర్డినెన్సుల రాజ్యం అనేనింద ప్రభుత్వానికిరాకపోవచ్చు. అయితే గవర్నరు ప్రసంగంమీదా యితర ప్రతిపాదనలపై జరిగే చర్చల సందర్భంలోనూ ప్రభుత్వం మీద పలు రకాల ఆరోపణలు రావచ్చు, వాటన్నింటిని ప్రభుత్వం ఎదుర్కోవలసి ఉంటుంది. మరి ఇది ఆంధ్ర అసెంబ్లిగదా.

పబ్లిక్ అక్కౌంట్లకమిటీ యింతవరకు పనిచేయగల అవకాశంరాలేదు. ఇప్పుడు దానిని ఎస్టిమేట్లకమిటీగా మార్చాలనీ ఆయన మద్రాసురాష్ట్రంనుంచి యింకా అక్కౌంటురావలేదు. ఆర్థిక వ్యవహారాలన్నింటిలోను శాసనసభకు [illegible] ఉండాలని, ప్రతిపక్షంలో ఉండగా శాసనసభ్యుల ప్రజాస్వామిక హక్కులనుగురించి ఎలుగెత్తి చాటిన మన ఆర్థికమంత్రి విశ్వనాథంగారు యీసారి తమ పూర్వాశ్రమపు ఆదర్శాలను యీసారి ఆచరణలోకి తీసుకొని రాగలరని ఆశిస్తున్నారు.

మామూలుగానే ప్రశ్నోత్తరాల సమయంలోనూ, చర్చల సందర్భంలోనూ, ప్రభుత్వం యిచ్చిన వాగ్దానాల జాబితాను తయారుచేసే ప్రయత్నమేమీ జరుగలేదు. కనుక, యింతవరకు ప్రభుత్వంచేసిన వాగ్దానాలలో ఎన్ని నెరవేరినవో చెప్పడం కష్టం. సభ్యులుకూడా ఆ విషయం మరచిపోయి ఉండవచ్చు. ఈ సమావేశంలో సభ్యులు కొన్ని కోరికలు కోరడం వాటికి ప్రభుత్వం వాగ్దానాలు చేయడం జరుగుతుందనుకోవడం న్యాయమే. అయితే ప్రభుత్వం యింతవరకు గట్టిగా ఏ వాగ్దానం చేయలేదని మాత్రం మనం గుర్తించాలి.

లోటు బడ్జెటును భర్తీ చేయడానికి వెనుక ప్రకటింపబడిన ప్రకారం కొన్ని కొత్త పన్నుల సూచించబడవచ్చునని తెలుస్తోంది. భూమి శిస్తు పర్చాల్తీ రూ 150/- పైబడి శిస్తు చెల్లించే వారికి రూపాయికి 0-2-0 మొదలు 0-12-0 వరకు వివిధ గ్రేడులలో పన్ను అధికంగా పడవచ్చు. అమ్మకాలపన్ను వల్ల ప్రస్తుతం మూడు మూడున్నర కోట్ల వరకు ఆంధ్ర ప్రభుత్వానికి ఆదాయం వస్తోంది. ఇందులో 1/12 ఆదాయం హెచ్చింపునకు ప్రభుత్వం కొన్ని అధిక రేట్లు విధించవచ్చని కూడా తెలుస్తోంది. నీటి వనరు సౌకర్యాలు కొత్తగా అభివృద్ధి చేయబడినందువల్ల భూమి విలువ పెరిగినచోట సగం మూల్యం వరకు 80 వార్షిక వాయిదాల్లో రైతులనుంచి వసూలుచేస్తే 20 లక్షల రూ.ల ఆదాయం ప్రభుత్వానికి వస్తుంది. సన్న గుడ్డపై విక్రయపన్ను ఇప్పటి రేటుకు కొంతకూడా పెరిగే సూచన కనిపిస్తుంది. వీటన్నిటివల్ల మొత్తం కోటిలోపు అదనంగా ప్రభుత్వానికి ఆదాయం వచ్చునని అంచనా ప్రస్తుతం వేస్తున్నారు.

రూ 10 ల లోపు [illegible]

### [illegible] చేయడానికి ఆలోచనలు

కర్నూలు, అక్టో 28: [illegible] గవర్నరు ప్రసంగంలో [illegible]

## జనీవాయుద్ధ విరామ సప్పందం అమలు

### కాంబోడియాలో అంతర్జాతీయ కమిషన్ పర్యటన

న్యూఢిల్లీ, అక్టోబరు 27: ఒక టీములో ఒక భారత సైనికాధికారి, ఒక కెనెడియను అధికారి, ఒక పోలిష్ అధికారితో కూడిన బృందాలు కాంబోడియాలోని వివిధ రాష్ట్రాలలో పర్యటిస్తూ జనీవా యుద్ధ విరామసప్పందం అమలులో చేయడానికి తోడ్పడుతున్నవి. ఉభయపక్షాలవారి విశ్వాసమును పొందడానికి అవి ప్రయత్నిస్తున్నవి: సైనికుల ఉపసంహారణ సమయమున, యుద్ధఖైదీల, సివిలియన్ నిర్బంధితుల విడుదల సమయమున యేర్పడే విషమ పరిస్థితులను తమ కలుపబడిన వినియోగించి తొలగిస్తున్నవి. దేశంలో వీరు సంచారం చేస్తూ పుండడంవల్ల గ్రామ సీమలలో తిరిగి విశ్వాసం నెలకొంటున్నది. నిరుత్సాహకరమైన పరిస్థితులలో, కొత్త పరిసరాలలో, తమకు యెంతమాత్రమూ హితముకాని వాతావరణంలో, కొత్త భాష మాట్లాడే ప్రాంతంలో వీరు చాలా చాకచక్యంగా, మర్యాదగా తమ విధులను నిర్వర్తిస్తున్నారు.

అంతర్జాతీయ కమిషను పురోగామి బృందం వచ్చిన 15 రోజులలోనే పరిశీలనాబృందాల స్థాపనకు తగిన ప్రదేశాలను పరిశీలించి స్థావరాలను యేర్పరచడమైంది. ఆగస్టు 24 వ స్వీరింగ్ ఆనేపోట ఒక స్థావరాన్ని యేర్పరిచారు. కాంబోడియా రాయల్ ప్రభుత్వ ప్రతినిధులతోను, విప్లవకారుల ప్రతినిధులతోను, వియట్ నామీస్ సైనిక ప్రతినిధులతోను కూడిన ఒక కమిషను ఈ స్వీరింగ్ లోనే యేర్పరిచారు.

భారతదేశము నుంచి ఇతర దేశాల నుంచి వచ్చిన అధికారులు ఈ కమిషనుకున్నూ అంతర్జాతీయ కమిషన్‌కును మధ్యవర్తులుగా వ్యవహరించి చాలా ప్రయోజనకరమైన పని చేశారు. ఈ రెండు కమిషన్లకు మధ్య అనేక సభలు జరిగాయి. అనేక సమస్యలు పరిష్కారమైనవి. అన్ని పక్షాలవారు ఓర్పు, పట్టుదల చూపుతున్నారు. ఈ సభలకు అంతర్జాతీయ కమిషను అధ్యక్షుడు శ్రీ జి. పార్థసారథి అధ్యక్షత వహించారు. ఈ సభలు జయప్రదం కావడానికి కెనడా, పోలిష్ ప్రతినిధులు చాలా సహాయం చేశారు.

పురోగామిబృందం పని ప్రారంభించిన కొద్ది రోజులకే జనీవా సప్పందను ననుసరించి యేర్పడవలసిన తనిఖీ బృందాలన్నీ యేర్పడినాయి. ఈ బృందాలకు భారత అధికారులు నాయకత్వం వహిస్తున్నారు. మూడురాయబార వర్గాల సైనిక సలహాదార్లనుండి యివి ఉత్తరువులు పొందుతున్నవి.

## ఇటలీ వరదల్లో 279 మంది మృతి

సాలెర్నో, అక్టోబరు 27: దక్షిణ ఇటలీలో సంభవించిన వరదలలో 279 మంది మరణించారు. 300 మంది కనిపించడంలేదు. 215 మందికి గాయాలు తగిలాయి. 5 వేలమంది నిరాశ్రయులైనారు. యు. పి. ఐ.

## యానాంకు ఎగుమతుల నిషేధం

### కస్టమ్సు అధికారుల చర్య

కాకినాడ, అక్టోబరు 27: పరిసర గ్రామాలనుంచి యానాంకు ఆహార పదార్థాలు, పాలు, పెరుగు, నిత్యావసర వస్తువులు స్వేచ్ఛగా ఎగుమతి కాకుండా కస్టమ్సు ఉద్యోగులు 25 నుంచి నిషేధించినందువల్ల యానాంవారు కటకటలాడుతున్నారు. ఇదివరకెన్నడు యిటువంటి యిబ్బంది వారికికలగలేదు. దీపావళిపండుగ సందర్భమున జరిగిన యీసంఘటనపై అందరూ విచారించుచున్నారు. ఈవిషయము కేంద్ర ప్రభుత్వానికి తెలియజేయబడింది. స్వ. వి.

## మహాపండితుడు, వాగ్గేయకారకుడు

### కర్ణాటక సంగీతానికి దీక్షితార్ సేవ: ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారు జోహార్లు

మద్రాసు, అక్టోబరు 28: "దీక్షితులవారు కర్ణాటక సంగీతమునకు సమర్పించిన గొప్పతనం, ఆయన ఉత్తమ కృతులలో. వాటికి ఆయన సంతరించిన రాగప్రస్తారములో - ఆ రాగాన్ని నిర్మించడంలో ఆయన చూపిన అపూర్వప్రతిభలో, ఆప్రతిభను విశ్వసించడంలో నిబద్ధమూచేసిన హృదయము కృతులలో ఇమిడి ఉన్నది" అని మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పాకాల వెంకట రాజమన్నారుగారు నిన్న రాత్రి మద్రాసు రేడియోనుంచి దీక్షితుల దినోత్సవసందర్భాన మాటలాడుతూ చెప్పారు.

దీక్షితులవారి కృతులు అర్థం కావాలంటే వాటిని అర్థంచేసుకొనే శక్తికూడా కావాలి. అందువల్లనే అవి సంగీత విద్వాంసులకు బాగా ఉండి సామాన్యులకు దూరంగా ఉన్నట్లు కనపడతాయి. ఆకృతులలో అమోఘమైన సంగీతసాహిత్యం ఇమిడిఉన్నది. అనికూడా వారుచెప్పారు.

త్యాగరాజుకు దీక్షితులవారికీఉన్న భేదాన్ని గూర్చి ప్రస్తావిస్తూ రాజమన్నారుగారు ఇల్లా అన్నారు. "దీక్షితులవారు సంగీతవిద్వాంసులకు విద్వాంసుడు. త్యాగరాజు సర్వజన సుఖుడు. దీక్షితులవారిలో రాగభావములు నిభృతంగాఉండి పండితమానసైక వేద్యంగా ఉంటాయి. త్యాగరాజులో అవి పైకి కనిపిస్తూ ఉంటాయి. అందువల్ల ఈపైకి కనిపించేదాన్ని గూర్చి ఎక్కువ కష్టపడవలసిన అవసరం లేకుండా పోతున్నది. దీక్షితులవారి విషయంలో గట్టి అధ్యయనం అవసరం."

"సర్వలలితకళల చరిత్రలోను కొన్ని కొన్ని ఉచ్ఛదశలు ఉంటాయి. అటువంటి ఒక ఉచ్ఛదశ కర్ణాటక సంగీతానికి 18 వ శతాబ్దం అంతంలోను 19 వ శతాబ్దం ఆదిలో వచ్చింది. ఆ రోజుల్లో త్యాగరాజు ముద్దుస్వామి దీక్షితులు శ్యామశాస్త్రి, శ్రీ మహారాజా స్వాతి తిరునాళ్లు, శోడి సీతారామయ్య, గోవిందమరార్, వడివేలు సోదరులు, అరుణాచలకవి ప్రభృతి మహాగాయకులు పుట్టారు. ఇది కర్ణాటక సంగీతానికి స్వర్ణయుగంలాంటిది. ఈ యుగంలో ఈ అందరిలో మిగిలి త్యాగరాజు, దీక్షితులవారు, శ్యామశాస్త్రి, కర్ణాటక సంగీత ప్రపంచానికి త్రిమూర్తులై భాసించారు. వారు ముగ్గురు ఏక గ్రామ వాస్తవ్యులవడంకూడా ఇందులో విశేషం. ఈముగ్గురూ వేర్వేరు పద్ధతుల్లో వేర్వేరు మార్గాలలో కర్ణాటక సంగీతాన్ని విజృంభింపచేసి దానికి ఒక పూర్ణత్వాన్ని చేకూర్చగలిగారు."

"ముత్తుస్వామి దీక్షితులవారు జన్మించి, మరణించి వందసంవత్సరాలింకాగాలేదు. అయినా ఆయనజీవితం గూర్చి మనకేమీ తెలియదు. ఇది లేకపోవడం భారతీయులకు చారిత్రకదృష్టి లేక అనిగాదు. భారతీయులకు ఒక వ్యక్తి సాధించిన కార్యము ముఖ్యముగాని ఆ వ్యక్తిముఖ్యంగాదు. దీక్షితులవారు ప్రసిద్ధమైన సంగీత విద్వాంసుల కుటుంబంలోంచి వచ్చారు. మహాగాయకుడు పండితుడు వెంకటమఖి ఏకుటుంబానికి చెందినవాడో ఆ కుటుంబమే. తండ్రి రామస్వామి దీక్షితులు మంచి గాయకుడు. దీక్షితులవారు వేదధ్యయనముచేసి వేదాంగములైన వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషము మొదలైన శాస్త్రాలనుగూడా కూలంకషంగా అభ్యసించినట్లు ఆయన కృతులనుబట్టి తెలుస్తుంది. ఆయన కావ్యాలంకారములలో నిధి. యోగశాస్త్రమును గూర్చి వారి కృతులలో ఉన్న ప్రసక్తినిబట్టి యోగాభ్యాసములో ఆయనకుగల పరాయణత్వము వ్యక్తమవుతుంది. వారి కృతులలో బహుకృతులలో మంచి శాస్త్ర ప్రసక్తికూడా ఉన్నది. చిదంబరనాథ గురుజవుని బోధవలన దీక్షితులవారికి ఈ శాస్త్రంలో మంచి ప్రవేశం లభించింది."

"దీక్షితులవారు దేశములో బాగా తిరిగినవారు ఉత్తర దక్షిణ దేశములలో గల సర్వతీర్థములను సర్వదేవాయతనములను ఆయన దర్శించారు. కాశీవిశ్వేశ్వరునిగూర్చి, విశాలాక్షినిగూర్చి గంగనుగూర్చి ఇంకా సర్వ దక్షిణదేశ తీర్థములగూర్చి, ఆయన కృతులు వ్రాశారు. పంచ లింగములనుగూర్చి ప్రశస్తి ఈయన కృతుల్లో ఉన్నది. 'చింతయమాం' అని భైరవి రాగంలో వ్రాసిన కీర్తనలో కాంచీపురంలోని 'పృథ్వీలింగాన్ని', యమునా కల్యాణిలో వ్రాసిన 'జంబూపతే' అనే కీర్తనలో జంబుకేశ్వరంలోని జలలింగాన్ని, 'అరుణాచలనాథం' అన్న సారంగ రాగములో వ్రాసిన కీర్తనలో తిరువణ్ణామలైలోని జ్యోతిర్లింగాన్ని గూర్చి, శ్రీ కాళహస్తీశ, అనే హుసేని రాగంలో వ్రాసిన కీర్తనలో కాళహస్తిలోని వాయులింగాన్ని, 'ఆనందనటన ప్రకాశం' అనే కేదారంలో వ్రాసిన కీర్తనలో చిదంబరంలోని ఆకాశలింగాన్ని ఆయన ధ్యానించారు."

"ఉత్తర హిందూస్థానంలో తీర్థాటన [illegible] హిందూ స్థానీ సంగీతమార్గాలను చేర్చిఉంటారు. యమునాకల్యాణి, అమీర్ కల్యాణి, జయజయవంతి, బృందావన సారంగ ఆదిగా గలరాగాల్లో కనిపించే హిందూస్థానీ రాగకవలికలు ఈ విషయాన్ని స్పష్టంచేస్తాయి. త్యాగరాజులో ఇది మృగ్యము."

"సంస్కృత భాషలో దీక్షితుల వారికున్న పాండిత్యము అపూర్వమైనది. శబ్దముమీద అధికారము, వ్యాకరణములో శక్తి, ఛందస్సులో ప్రమాణము ఈయనలో ప్రత్యేకంగా కనిపిస్తాయి. సంస్కృతభాషలో ఉన్న గానశక్తినంతా వీరు కృతులలో ఇమిడించగల్గారు. శబ్దాలను వాడగడంలో ఆయన ప్రజ్ఞ ఇంద్రజాలికంగా ఉంటుంది. మృదువు, కటువు, కర్ణపేయము, రంజనము ఉత్తాలము, సామాన్యము, అన్ని శబ్దాలను ఆయన విచిత్ర ఘణుకులలో మేళవించి శ్రోతలను ముగ్ధులను చేస్తారు. ఆయన కృతులు శబ్దాలంకారాలకు భాండారాలు. ఛేకానుప్రాస, వృత్త్యనుప్రాసయమకములన్నీ ఆ భాండారంలో పప్పులు తెప్పలుగా కనిపిస్తాయి. ఉదాహరణకు శంకరాభరణంలో 'అక్షయలింగవిభో' అనే కృతిలో అను పల్లవిలో 'క్ష' అనే వర్ణాన్ని ఉపయోగించి ఆయన సృష్టించిన ధ్వని ప్రపంచము అతివిచిత్రమైనది. 'దక్షశిక్షణ, దీక్షితరసురలక్షణ, విధివిలక్షణ, లక్ష్యలక్షణ, బహువిచక్షణ, సుధాభక్షణ, గురుకటాక్ష వీక్షణ'.

"దీక్షితుల చరిత్ర శిష్యులను ఆట్టేమందిని చేర్చుకోకపోవడంవల్ల ఆయన కొన్ని వందల కృతులు రచించిన విద్వాంసులవంటివారికికూడా ఇప్పుడు [illegible] ఇది విచారకారణం అవుతున్నది. కర్ణాటక సంగీత ప్రియులు, ఆయన కృతులను శోధచేసి పదిలంగా అట్టే పెట్టాలి. ఇప్పుడు దీక్షితులవారి కృతుల యందు అభినివేశముఉన్నవారు చాలామంది బయలుదేరుతున్నారు. ఇప్పుడు ఆకృతులు వచ్చినవారు కొద్దిమంది మాత్రం ఉన్నారు. అందులో సుప్రీం కోర్టు న్యాయమూర్తి టి. ఎల్. వెంకట్రామయ్యరుగారు పేర్కొనదగినవారు. వారి ముఖత: సాధించి రికార్డు చేసి ఈకృతులకు పాఠాలను తయారు చేసి సంగీత పాఠశాలలను విద్యార్థులకు నామమాత్రమైన రుసుముతో చేకూర్చడం యోగ్యంగా నాకు తోస్తున్నది.

"దీక్షితులవారికీ త్యాగరాజులవారికీ ఉన్న తారతమ్యం గమనించతగినది. దీక్షితులవారు సామాన్యంగా తమకృతులలో విలంబకాల వాడతారు. కొన్ని కొన్ని కృతులలో మధ్యమ కాలకూడా వాడినపట్టులు ఉన్నాయి. త్యాగరాజు కృతులలో అట్లుగాక సర్వసర్వత్రా మధ్యమకాల కనిపిస్తుంది. విలంబకాల ఆయన ప్రయోగించ లేదని కాదు. 'చిరంగరాయి' అనే కాంభోజి రాగంలోని కృతిలో విలంబకమున మాధుర్యం పరాకోటిగా ఉన్నది."

"త్యాగరాజు అలతి అలతి పదములతో కృతిని కూరుస్తారు. దీక్షితులు వారు జటిలుడున్నూ, క్లిష్టుడున్నూ. త్యాగరాజుని కృతులు ద్రాక్షాపాకంలో వుంటాయి, దీక్షితులవారు నారికేళపాకంలోగాని వ్రాయరు. త్యాగరాజులో మాధుర్యగుణం ఎక్కువంగాఉంటే దీక్షితులవారిలో ఓజస్సు వికటమై ఉన్నది. అల్పమైన పదాలలో అనల్ప మాధుర్యాన్ని సృష్టించడంలో త్యాగరాజు నిధి. సమాస ఘటనంతో ఓజస్సును సృష్టించడంలో దీక్షితులవారు ఆయనకు ఆయనేసాటి. ఈశ్వరోపాసనలో గూడా ఈ ఇద్దరిలోను భేదము ఉన్నది.

త్యాగరాజు సగుణబ్రహ్మోపాసకుడు. దీక్షితులవారు నిర్గుణబ్రహ్మోపాసకుడు. త్యాగరాజు కృతులలో ఆవేశము కనిపిస్తుంది. దీక్షితులవారి కృతులలో వితతమనస్విత వ్యక్తమౌతుంది. త్యాగరాజు కృతులను మనం హృదయం పెట్టు వింటాము. దీక్షితులవారి కృతులను మేధస్సుకు విప్పి వినాలి."

"దీక్షితుల వారు అగ్రశ్రేణికిచెందిన వాగ్గేయకారకుడు. మహాపండితుడు. బహుశాస్త్రవేది. శబ్దశాస్త్రవేత్త, మహాభక్తుడు. ఆయన పోయిన ఈ వంద ఏండ్లలో అట్టివాడు మరియొకడు పుట్టలేదు. ఇకముందు వస్తాడనే నమ్మకం గూడా కనిపించదు. ఆయన ముందు మనకుగల భక్తిని చెల్లించుకోవడానికి అందువల్ల ఒక్కటేమార్గం ఉన్నది. ఆయన కృతులను పఠించి, ఆకళింపు చేసుకుంటే మనం తరిస్తాము."

## హెమ్మింగ్వేకు నోబిల్ బహుమానం

స్టాక్‌హోం, అక్టోబరు 28: అమెరికన్ నవలారచయిత ఎర్నెస్ట్ హెమ్మింగ్వేకు ఈ యేడు నోబిల్ సాహిత్య బహుమానాన్ని ప్రసాదించారు. ఈ బహుమానం మొత్తం 181646 క్రోనులు, అంటే 12500 పౌనులు, నోబెల్ బహుమానధార్మిక సంస్థ తరఫున స్వీడిష్ సారస్వత అకాడమీ వార్షిక దీన్ని ఇట్లా నిర్ణయించారు. ఈ నిర్ణయాన్ని ఈ అకాడమీ కార్యదర్శి డా॥ ఆండర్స్ ఓస్టర్ లింగ్ ప్రకటించారు.

## శ్రీ కళా వెంకట్రావుగారు

కర్నూలు, అక్టోబరు 28: శ్రీ కళా వెంకట్రావుగారు నిన్న సాయంత్రం ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారిని కలుసుకొని చాలాసేపు సంభాషించారు.

శ్రీ వెంకట్రావుగారు, నేటి ఉదయం గవర్నరును రాజభవన్‌లో సందర్శించారు.

రెవిన్యూశాఖ కార్యదర్శి శ్రీ యం. టి. రాజుగారుకూడా గవర్నరును నేటి ఉదయం కలుసుకున్నారు.

మద్రాసు, అక్టోబరు 28: సెంట్రల్ పాలిటెక్నిక్ సానిటరీ ఇంజనీరింగు అసోసియేషన్ సభ రేపు 29 వ తేదీ సా॥ 4-30 గం విద్యాసంస్థ గ్యాలరీ హాలులో జరుగుతుంది. డా॥ బి. కళ్యాణసుందరంగారు నీళ్ళలోని క్రిములను గురించి ఉపన్యసిస్తారు. శ్రీ పి. రామస్వామిశెట్టిగారు అధ్యక్షత వహిస్తారు.

